ఎగురుచుండగా, వెంద్రుకలు ముఖమున నాడ, ఆ పడవ నానుకొని, సౌంద
దేవతాయనునట్లు కానవచ్చు చుండెను. పడవ వేగమున చెట్లు వెనుకకు పరుగె
చున్నట్లున్నవి. దూరపు పొలముల నుండి కీచుమను శబ్దములును, తెడ్లపై
నీటి శబ్దము మాటిమాటికి నిశ్శబ్దమును భేదించుచుండెను. కట్టపై నుండి చెట్లక్రి
నీడలు వెన్నెల గంభీరత్వమును నినుమడిం చుచుండగా, కదలుచున్న నీటి
చంద్రకిరణములు వేయి విధముల మెరయుచుండెను.

సుంద – మీరు క్లియోపాట్రా. నైలుమీద నెట్టుచుండు బానిసలము మేము

కృష్ణ – మనవాళ్ళల్లో ఎవర్నన్నా చప్పరా అల్లాంటి వాళ్ళని.

సుంద – మనవాళ్ళల్లో పురుషుణ్ణి స్వాధీనం చేసుకొన్న స్త్రీ కూ
వుందంటావా యేమిటి?

కృష్ణ – ఛా, నువన్నీ యిట్లానే అంటావు. మహాపతివ్రతలుండగా అ
అంటావేం?

సుంద – నేననేదీ అదే. అందరూ పతివ్రతలే కాని పత్నీవ్రతం చేయించగ
వాళ్ళు వొక్కళ్ళూ లేరని.

కృష్ణ – లేకపోవడమేంలే, ఎంతెంత చక్రవర్తుల్నీ వేలుమీ
తిప్పినవాళ్ళున్నారు.

సుంద – ఎప్పుడో ఒకప్పుడు స్త్రీ నాశించి పురుషుడు లోబడ్డా నిమిషా
గాని, తరువాత తన్నులో, శాపమో దాని రాత.

కృష్ణ – అందరూ అంతేనా?

సుంద – నాకేంటి! ఎంతసేపటికీ అందంచేత మెరిపించారు కొంద
కొందరు నీతిపాఠం ముక్కలు వల్లవేసి భర్తలముందు ఏకరు పట్టారు నీతు
చిలకలమల్లే. ఇంతేకాని తమ బుద్ధి బలం వల్ల, ఆత్మ బలం వల్ల , భర్తల సహ
గుణాన్ని మార్చి, సన్మార్గానికి తిప్పగలిగిన స్త్రీలు ఒకళ్ళూ లేరు. దుర్మార్గాని కీడ్చి
వాళ్ళున్నారు. ఎంత సేపటికి భర్తకోసం, తమ సుఖాన్ని , ప్రాణాన్ని, మాన
ఆఖరుకి ఇచ్చారు కాని, వాళ్ళకి నిజమైన ఉపకారం చేసిన వాళ్ళు లేరు అందరూ
బానిసలు.

కృష్ణ – పోనీ అంత స్వార్థ త్యాగం చేశారు. చాలదూ?

సుంద - చేసి ఏం లాభం? తమకి మహోపకారం చేస్తున్న పురుషుడికి ఇంకొంచెం వీలు కలిగించారు. వాళ్ళకి ఇంకా దౌర్జన్యం నేర్పారు. స్త్రీకి గౌరవం న్యాయం లేకుండా చంపుకున్నారు. అంతే.

కృష్ణ - నేను వప్పుకోను.

సుంద - దాన్ని మొండివాదం అంటారు.

శశి - చేతులు నెప్పెట్టడం లేదూ మీకు? ఇంక వెనక్కి వెడదాం.

సుంద - సరే. వెనక్కి వెళ్ళడమంటే పడవని వదిలెయ్యడమేగా.

కృష్ణ - శశీ, సుందర్రావు ఫిడేలు వాయించడం నువ్వు వినలేదు కదూ, ఈవాళ వాయిస్తాడు.

సుందరరావు ఫిడేలు వాయించెను. ఆహా యేమి వాయిద్యము! ఏవో ఇదివఱ కెన్నడూ ఎరగని కోర్కెలనన్నిటిని బయటకు లాగుకొని వచ్చెను. వానికి అంతము లేదు ఆ కోర్కెలు ఫలించ వెన్నడునూ. అందరానివి. మానవశక్తి కతీతములు. ఆహా, ఆ స్వరముల సౌందర్యము? ఆ గాలితో యూగు ఆకుల గీతములతో, ఒడ్డును ముద్దిడు అలల శబ్దములతో, ఆ సౌందర్యమున ధ్వనించు ఆత్మగానముతో కలిసి మెలసి ఒకటై ఆ వెన్నెల మార్దవమును, ఆ మేఘముల రంగులను, ఆ ఆకసపు నీలపు లోతును, ఆ నీటి ప్రకాశమును, ఆ భూమి సౌజన్యమును, ఆ పచ్చిక లావణ్యమును, చెట్ల నీడల నిశ్శబ్దమును, పరిమళమును, అంతటిని ఆత్మ సామీప్యమునకు కొని వచ్చి విడిచినదా గానము. "కావలెను" "కావలెను" మహాతృష్ణతో అరచినది. "కావలెను. ఏమి కావలెనో తెలియదు. ఈ సౌందర్యము కన్న, ఈ దేహ సౌఖ్యముకన్న అధికమైనది, శాశ్వతమైన దేదియో కావలెను" అని నరనరముల నుండి భూమి రంధ్రముల నుండి, చెట్లయాకుల చిన్న నోళ్ళ నుండి, చంద్రకిరణములనుండి, ఆ జలకణముల నుండి మహాబాధతో విలపించినదా గానము. దుఃఖము భరింపరానిదైనది. సౌందర్యము నిలువదు. మేఘములు పరువెత్తుచున్నవి. రంగులు మాయమైనవి, యవ్వనము పోవుచున్నది. శరీరము శుష్కించినది. పువ్వులు వాడినవి. పరిమళము లేదు. పసిపాప యెదుగుచున్నది. ముద్దుమాటలు మాయమైనవి చూచునంతలో, అనుభవించునంతలో, ముట్టుకొను నంతలో నిలువకపోవుచున్నది సౌందర్యము. యేది యేది. ఆ సౌందర్యము అని పర్వులెత్తినది ఆ గానము.

ఆ గాన మాధుర్యమునకు కృష్ణుడు నిద్రావివశుడయ్యెను.

శశిరేఖ కండ్ల నుండి జలజలమని నీరు వ్రాలెను.

శశి - అట్లా పాడ్డం చేతకావడానికి నా ప్రాణమన్నా యిస్తాను.

సుంద - అంత ఇష్టమూ సంగీతమంటే?

శశి - మీరు పాడుతున్నంతసేపు నిగూఢమయిన నా మనోభావముల్ని నా సర్వశక్తులున్నూ మిళితములై వ్యక్తీకరింపబడినట్లు తోచింది. అట్లాం సంగీతానికి ప్రాణమిచ్చినా తనివితీరదు.

సుంద - ఇంత ఇష్టంగా విని ఆనందించేవాళ్ళు దగ్గిర వుంటేనే గా సంగీతం వచ్చి సార్థకమేమున్నది? మీరు కూడా నేర్చుకోరాదూ అంత యిష్టమై

శశి - నేర్పేవాళ్ళెవరు? తీరుబడిలేదు. జీతమియ్యడానికి డబ్బూ లేదు.

సుంద - ఎన్నాళ్ళని యిల్లా దేనికీ కరువు పడుతోవుంటారు మీరు? డ కావాలనిపించదూ మీకు?

శశి - పాపము కృష్ణుడికేమీ చేతకాదు. నన్ను విడచివెళ్ళి చదువుకోడు

సుంద - అందరూ లోకంలో వెళ్ళటంలేదూ? ఇన్నాళ్ళు చాలదా యేమి ప్రేమ ఇంకా యెన్నాళ్ళు ?

శశి - ఏమిటట్లా అంటున్నారు?

సుంద - మరేమీలేదు. మొగాళ్ళ ప్రేమ చంచలమని.

శశి - కృష్ణుడికి నామీద ప్రేమ పోతుందా! ఆ చంద్రుడు వేరవుతా గాని! నా కోసంకాదూ, వుద్యోగమూ, చదువు లేకుండా ఇట్లా వున్నాడు?

సుంద - అదో కష్టం గావును? మీలాటి వారికోసం లోకంలో ఎవరు అంతకంటే ఎక్కువే చేస్తారు. ఇంతకీ వాడి అదృష్టం.

శశి - ఏంటో కొత్తగా మాట్లాడుతున్నారు. నాకు బాగా వుండలేదు.

సుంద - ఏమనుకుంటే ఏం లాభం? నేను ఫిడేలు నేర్పితే నేర్చుకుంటా

శశి - ఆయన్నడుగుతాను. అయినా నాకు వస్తుందనుకోను.

సుంద - ఎందుకు రాదు? ఇప్పుడు చూడండి. ఎంత సులభమో ఇ పట్టుకుని కమాను లాగి చూడండి.

శశిరేఖ ఫిడేలు తీసికొని వాయించెను. అట్లు కాదని అతడు చేయి పట్టుకొని యించపోయెను. ఆమె చెయ్యి వెనుకకు లాగుకొనగా, పడవ వెనుకకు గెను. తత్తరపాటున ఆమెనాతడు గట్టిగా రెండు చేతుల తోడను లాగుటచే ు అతనిని త్రోసి వెనుకకు వరిగెను. పడవ సగము వరిగి శశిరేఖ నీళ్ళలో ను. ఇదివరకే మేల్కాంచిన కృష్ణుడును, సుందరరావును, నీళ్ళలోకి దూకి ఆమెను ్డున చేర్చిరి. శశిరేఖకు స్మృతి లేదు.

తెల్లవారునప్పటికి శశిరేఖకు ఎక్కువగా జ్వరము తాకేను. కడుపు నందు ీవమగు నొప్పిచే బాధపడుచుండెను, సుందరరావు చూచి ఆమె అపాయస్థితిలో న్నదనియును, యింటివద్దకన్న నుపచారము బాగుగా జరుగుననియు, నామె స్పత్రికి మార్పించెను. కృష్ణుడును సుందరరావును రేయింబగళ్ళు ఆమెను చుకొని యుండిరి. పదిహేను దినముల కామెకు స్వస్థత కలిగెను. కాని మిగుల హీనముగ నుండి ఆస్పత్రియందే యున్నది. ఇంతలో కృష్ణుని తల్లికి విషజ్వరము లినది. ఆ యింటికి శశిరేఖను తీసుకుని వెళ్ళుట మంచిదిగాదని సుందరరా ెను. తల్లిని కనిపెట్టుకొనియుండు కృష్ణుడును ఎక్కువసార్లు శశిరేఖను చూచుటకు లేదు. శశిరేఖకు కావసిన యుపచారమును చేయించుటయు, ఆమె వంటరిగా ుండకుండ మాట్లాడించుటయు సుందరరావుపై బడినది. ఒకనాడు మధ్యాహ్నము ిరేఖ ఆస్పత్రిలో తన గదిలో మంచముపై పరుండగా సుందరరావు కుర్చీపై ర్చుని మాట్లాడుచుండెను.

సుంద - ఎట్లా ఉందీవేళ, చెయ్యి ఏదీ, మెత్తని చెయ్యి. ఎంత మొద్దెక్కినదో ి వల్ల. తామరాకును తాటాకు చేయుటం పాపము.

శశి - పనిచెయ్యక తప్పుతుందా ఆడవాళ్ళయిన తరువాత?

సుంద- కొందరికన్నా తప్పి తీరాలి. కొన్ని పువ్వులను తల్లో పెట్టుకుంటారు. న్నిటిని చెట్లమీదనే వాడిపోనిస్తారు, అన్నీ ఒకటే?

శశి - మీకుమల్లే ఉద్యోగంలో వుంటే కృష్ణుడుకూడా నవుకర్లను పెట్టేవాడే.

సుంద - ముందు నా ప్రాణాన్ని పోగొట్టుకుంటాగాని అట్లాంటి చెయ్యిని ి చెయ్యనిస్తానా? ఆ మృదు దేహం మీద ఈగని వాలనిస్తానా?

అతని కంఠధ్వనియందేదో మార్పు వినిపింపగా శశిరేఖ ముఖమెత్తి తనివైపు చూచునప్పటికి కండ్లయం దగ్ని మండుచున్నటుల కాన్పించెను. అతడేదో

లోపల నణచు కొనుటకు మహాప్రయత్నములు సలుపుచున్నటుల కా
చుండెను. శశిరేఖ బలహీన మామె కొక కొత్త యందము నిచ్చినది. బల
నిటునటు తిరిగి దొరకకుండ నుండినది. అసహాయురాలై యొక గుప్పెటలో
నటుల అచట పరుండి యుండుట కలిగినది. ఆ కండ్లు మాత్ర మతి ప్రకా
ములై ఆకర్షణాశక్తి నినుమడించుకొనెను. కలవ తూండ్లవలె తెల్లని
హస్తములు సన్నని దేహము ప్రక్కన పడియుండెను. మొదటినుండియు శశి
సుందరరావును చూచిన ప్రీతి. అతని వైద్యము, మర్యాద, సంపాదన
నామె కాశ్చర్యమును, గౌరవము కలదు. ఎంతో నిపుణతతో తాను
రోగముల నాతడు చెప్పినపుడు ఆమె యాతని శక్తి కాశ్చర్యపడుచుండెను
యీ దినమాతని ముఖము కాంచినది మొదలు ఆమె హృదయమున కొత్త
మొకటి కనబడినది. గుండెలు తటతట కొట్టుకొనుచు మనసు గిర్రుని తిరి
చుండెను. తెలివిగల యాతని ముఖమును, సున్నగ గొరిగిన యా
పెదవులను, తీక్షణములగు నా కండ్లు చూచిన నామెకు భయము
భయమువలని అయిష్ట తయు, నాతనిపై గల గౌరవముచే నిష్టతయు కలి

శశి – మీకు ఇష్టమయినట్లాంటి వాళ్ళని పెళ్ళి చేసుకోరాదూ?

సుంద– శశీ! నీకు తెలీదూ? నన్నింకా అర్థం చేసుకోలేదూ?

అని ఆమె ముఖము దగ్గరగా వంగి అడిగెను.

శశిరేఖ వడలు కంపించినది. రెండు చేతులతో నతనిని నెట్టివేసెను
అతడా చేతులను గట్టిగా పట్టుకొని వానిని బలవంతముగ ముద్దు పెట్టి
వెళ్ళిపోయినాడు.

శశిరేఖ అట్లే పరుండి ఆలోచించుకొన్నది. బలవంతముగ తన
కావించిన అవమానముకై మిగుల కోపం వచ్చినది. నేత్రములు కోపారుణము
ముఖమెర్ర బారినది. కాని అతని మాటలు, అతని స్పర్శ తన కానంద
కలిగించిన సంగతి జ్ఞప్తికి వచ్చుచుండెను. అతడేమి చేసినను తన కి
వచ్చుననియు, అతని ప్రేమను తానును వాంఛించుచున్నటుల ఆమెకు తో
ఆ తలపుతో వడలు వణకెను. భయము వేసెను. కృష్ణునియందు తనకు ప్రే
పోయినదా? పోనీ, తగ్గినదా? లేదు లేదనెను ఆమె హృదయము. కృష్ణుని
మృదుత్వమును, అమాయకత్వమును, తనపై నాధారపడు అసహాయత్వము

ను దైవముగా చూచు ప్రేమను, అతని కుర్రతనము తలచు కొనిన అతనిపై
మ యెంతో తోచుచుండెను. కాని సుందరరావు గంభీర స్వభావమును అతనికే
ండిన అతని శక్తిని, బలమును, తనయందాతడు చూపు గౌరవమును ఆమె
కర్షించెను. అందరును ఎవరిని గౌరవించుచుండిరో అతడే తన సౌందర్యము
దాసుడయ్యెనుగదా యని గర్వము కలిగెను. కృష్ణుడామెను "నీ వందముగా
న్నావ" న్నప్పుడు ఆమె యంద మామెకు తెలియలేదు చిన్నపిల్లవలె నవ్వెను.
ని యిప్పుడీతని చూపులే తన యందమును తనకు వెలిబుచ్చుచుండెను. కృష్ణుని
మ యే యాటంకములేక యామెపై ప్రవహించి ముంచివైచెను. కాని యీతని
మ ఆటంక పరుపబడి యాగి యాగిలోనిముడక ప్రవహించుచుండును. అతని
మను మళ్ళించుకొనుటకు, అతని తలపులను మార్చుకొనుటకు, అతడు చేయు
హో ప్రయత్నములు అతని ప్రేమకు మరింత బలమునాపాదించుచుండెను.
ష్ణుని ప్రేమించు తాను యీ తలపులనైన రానిచ్చుట మంచిదేనా? న్యాయమా?
పముకాదా? కాని తన మనస్సంతయును సుందరరావు వైపు లాగుచున్నదే!
తని ప్రేమలేక యెట్లుండకలదు? ఇతని ప్రేమను తృణీకరించి కృష్ణునితో
ర్వమువలె నుండగలదా? నిర్జీవముగా దినముల నెట్లు గడపగలదు? సూర్యుని
ద్దుల రుచి చూచిన కమలము, ఇక చంద్రుని వెన్నెలతో నెట్లు తృప్తినందగలదు?
ని కృష్ణుని ప్రేమించి తా నితనిని కూడ ఎట్లు ప్రేమించుట? తాను వీరిద్దరి
కసారే ప్రేమించుచుండెనా? మానవ హృదయమెంత నిగూఢమో! కృష్ణుడు
ను ప్రేమించెను: గాని అతను తన చూపుల తోడనే యితనివలె తన శక్తినంతను
గివైచి తన హృదయమును తనది గాకుండ చేయలేదు. వలయందు తగుల్కొని
యంతము బోగొట్టుకొనిన చిలుకవలె నామె యుండెను, కాని యెంత తాను
చినను కృష్ణుని మాత్రము తాను మోసపుచ్చకూడదని నిశ్చయించుకొని, వెంటనే
ష్ణునికి తన నింటికి తీసికొనిపొమ్మని యుత్తరము వ్రాసెను. ఆ సాయంకాలము
వాత దానచట నుండుట కిష్టము లేదనియెను. అరగంట లోపునను ఆస్పత్రి
కరు ప్రత్యుత్తరము తెచ్చెను.

శశీ,

అమ్మకు జబ్బు ఎక్కువైనది. ఇచ్చట కీస్థితిలో నీవు వచ్చుట కెంతమాత్రము
లేదు? నా కామెను వదిలి ఒక్క క్షణమైనను తీరుబడి యగుటలేదు. ఒక్క

వారము వణికచ్చుటనే యుండుము. నానుండి ఎడబాటు నీకెంత బాధ కలిగించు
తెలియును. కాని ఒక్క వారము రోజులే కదా! ముద్దులు.

ఇట్లెల్లప్పుడు నీ కృష్ణ

అనుభవ మెరుంగని నూతన యవ్వనమున కృష్ణని ప్రేమను గైకొన్న శశి
యిప్పుడు యిరువదియేళ్ళ స్త్రీ అయినది. కృష్ణుడు ఆమె మనసును
దొంగిలించెను. సుందరరావు ఆమెని స్త్రీవలె సన్మానించి ఆమె ప్రేమను
ఇప్పుడు ప్రౌఢ అయిన శశిరేఖ హృదయము ప్రేమ వికాసమును పొంది, గాఢ
గంభీరముగ తన సర్వశక్తులను పీల్చివేయు బలముగల భయంకర మోహము
కళ్ళు త్రిప్పుకొన లేకపోయినది. తీవ్రమగు ఉద్రేకములతో పెనగిన మహా
రక్తమామె నాళముల ప్రవహించుచుండెను. ఆమె పాదములకు నమస్క
తాకిన ఆమె దేహ మెక్కడ కందునో, అని ఆమెను దేవతగ పూజించే భక్తులలో
కవసరము తీరినది. ఆమెను నలిపి జీవన రసమును పిండి, తాగి, మూర్ఛనయ
గల ప్రేమ నామె వాంఛించెను. అగ్నివలె తాపమున దహించు తృష్ణకు ఉప
ముగ మహాప్రళయ, మేఘముల గర్జించు చండవర్షమే కావలెను.

## 6

ఆరు రోజులు గడిచినవి. సుందరరా వాదినము నుండియు శశిరే
స్థితిని కనుగొనుటయే గాని, ఆమె గదివైపున కైనను వచ్చుటలేదు. శ
యతడెందుకట్లు మారెనాయని యాశ్చర్యపడెను. అతనికి తనపై కోపము వ
కాటోలు! కోపము వచ్చిన తనకేమి? పోనీ ఇబ్బంది తొలగెను కదాయని సం
కదా! కాని మనసు వ్యాకులపడుచున్నది. తానింటికి పోవులోపల తనకు కో
రాలేదని అతనికి తెలియ చేయవలయును. కృష్ణని చూచుటతోడనే సుందర
విషయ మాతనితో చెప్పవలయునుకదా? అతడింక సుందరరావుతో తన కేమి
కోపము లేదనియు, కాని అతడట్లు తనను ప్రేమించుట తప్పనియును చెప్ప
ఎంత బాగుండును. ప్రొద్దుననే తాను తన ఇంటికి వెళ్ళుచుండెనే! ఇంక స
యేది?

ఇంతలో నౌకరొక చీటి తెచ్చియిచ్చెను. గుండెలు కొట్టుకొనెను, సుంద
దస్తూరి, వణకు వేళ్ళతో చీటి విప్పి చదివెను.

అమ్మా,

మీ అత్తగారికి స్వస్థతగా నున్నది. మీరు రేపు యింటికి పోవుచున్నారు. నా
రివితక్కువను క్షమించి యుంటిరేని, ఖా సాయంత్రము నా యింటి
క్కసారి భోజన మునకు వచ్చి, నన్నానందింపచేసెదరా? ఇంక నెన్నడును అట్లు
యను. నా తప్పిదము నకు నేనెంత బాధ్యుడనో మీ అందమును అంత బాధ్యత
దే.

ఇట్లు పశ్చాత్తాప తప్తహృదయుడు,
సుందరరావు

"సరే" నని చెప్పమని ఆమె ప్రత్యుత్తరము పంపెను. తానే సమయము
అకు వేచియుండెనో యది తనంతట యదే తటస్థించుటచే ఆమె హృదయము
ంతోషముతో నిండిపోయెను. వెంటనే దుస్తులు మార్చుకొని, దినముకన్న
ద్రముగ శృంగారించు కొనెను. ఎందుకంత కాలము ఆ అద్దము ముందు?
నా సుందరరావున కెట్లు కనబడిననేమి? ఏమో ఆమెకే తెలియదు. పాపము.
ంత పశ్చాత్తాప పడినాడో కదా! తన అందమతనినట్లు చేయునట్లు చేసి
యుండును. తనకంత అందము కలదా? పాపమాతడింక వంటరిగా నుండవలయు
నా? తననేగాక తన స్నేహితుని గూడ కోల్పోయి ఎంత చింతించునో? ఈ వక్క
యంత్రమే కదా.

సుందరరావు బంగళా, ఆస్పత్రి ఆవరణలోనే యుండెను. శశిరేఖ ఇదివఱ
ప్పుడును అచటకుబోయి యుండలేదు. చక్కని బంగళాయు చుట్టును సుందరమగు
న్నీ పూవుల చెట్ల తోటయు గలదు. తోట తలుపు దగ్గరకు వచ్చునప్పటికే సంతో
ము తొల్కాడు ముఖముతో సుందరరావెదురు వచ్చి ఆమెను తోటలోనికి తీసికొని
యెను. శశిరేఖ చుట్టును చూచినది. చామంతి విరివిగా పెరిగి మంచి వాసన
ప్పుచుండెను. పూర్ణముగ విచ్చిన గులాబీ పువ్వులు ఆకసమువైపు తెరచుకొని
యుండెను. అస్తమయ సూర్యుడు తోటనే రక్త వర్ణముతో కప్పెను. చంద్రకాంత
నేక రంగులతో నవ్వుచుండి నది. తడకలపై జూకామల్లె పాకియుండెను.

శశి – ఎంత అందంగా వుంది! యింత అందంగా ఎవరు చేశారు?

సుంద – నేనే.

శశి - ఇదివరకే నాతో ఎందుకు చెప్పలేదు? ఎంత అందంగా ఎప్పుడూ వచ్చేదాన్ని, ఇక్కడికి, నాకు తెలిస్తే , కల్లోకూడా ఇంత అంద తోట వుందనుకో లేదు.

సుంద - నేనూ, మీరూ, సమానంగా ప్రేమించే విషయాలు చాలా న్నాయే!

శశి - అందమయినదాన్ని చూస్తే నాకింక యేమీ అక్కర్లేదు. అందు యిచ్చేస్తాను. ఈ లోకంలో వున్న అందమయిన కట్టడాలూ. తోటలూ, చూడాలని వుంటుంది. ఈ దేశములోనే చూడ్డానికి నోచుకోలేదు. ఈ వున్న అందమయిన మనుష్యులందర్తోను స్నేహం చెయ్యాలని వుంటుం అందమూ నాది కాకూడదూ? ఎన్నిసార్లో ఆకాశంలో యిట్లాంటి అంద దాన్ని నాది అనుకుం టాను. కాని అప్పుడే పోతుంది. లోకంలో అంత అ అంతేగావును!

సుంద - కాదు. మీ మొహం అందం ఎన్నడూ పోదు.

శశి - పోకేంలేండి,ఆగండి నాలుగు నాళ్ళు.

సుంద - నేను చూపిస్తాను లోకంలో సుందర ప్రదేశాలన్నీ హిమాల యాల్లో మహారణ్యాలు, స్వర్గాన్నంటే హిమవచ్ఛిఖరాలు. గంగా నదీ తీరముల వనాలు, మలబారు సరోవరాలు, కావేరీ ప్రాంతము చూచి సంతోషించే సంతోషాన్ని నేనున్నూ పొందుతాను.

శశి - ఎట్లా? కృష్ణుడొప్పుకోవద్దూ? ముసలివారిద్దరో?

సుంద - లోపలికి రండి.

తన యిల్లునంతను అతడామెకు చూపెను.

శశి - ఈ పటములెక్కడివి? ఎంతందంగా వున్నాయి? ఎక్కడ అబ్బా! యీ పటాల్లో ఉన్నటువంటి చోట్ల వుంటే ఎంత బాగుంటుం విచారమనే మాట యెక్కడిది?

సుంద - మీతో ఎవరూ ఉండనక్కరలేదూ అక్కడ? ఈ పటాలు మీకు?

శశి- వద్దు. ఈ పుస్తకాలన్నిట్లో ఏముంటుంది. ఇవన్నీ మీరు ఇదంతా వైద్యమే?

సుంద - ఇవన్నీ కథలు.

సుంద - ఇవన్నీ కథలా? అన్నీ చదివారూ? మీకెన్నో కథలు వచ్చి ఉండాలి. న్నా యెన్నడూ చెప్పారుకారేం?

సుంద - మీకంత యిష్టమనుకోలేదు.

శశి - మీరన్నీ అట్లానే అనుకుంటారు. మీరు సంగీతం పాడిందాకా నాకంత మన్న సంగతి తెలిసిందీ? ఈవాళ పాడరూ వొకసారి!

సుంద - రాణి ఆజ్ఞాపిస్తూవుంటే సేవకుడు చేయకుండా వుండగలడా? మైన పిమ్మట అని శలవా?

శశి - (నవ్వుచు) సరే. ఎంత మంచి వాసన వేస్తోంది! ఇట్లాంటి బంగళాలో న్నా వుండడం బహుకష్టం. నిద్ర వచ్చేస్తోంది.

సుంద- ఈ బంగళా అందం నాకు యీ రోజున తెలుస్తోంది. పడిన కష్టం నికి వచ్చింది. మీ యిష్టం వచ్చినప్పుడు రండి. నేనే పనిమీదనున్నా మీరు మీదిలాగే వుపయోగించుకోవచ్చును.

శశి - మళ్ళా రానుగదా-

అని మరిచిపోయి జారి వచ్చెను.

సుంద - ఎందుకు?

శశి - ఏదో అట్లా అనిపించింది.

సుంద - మళ్ళా రారా? మీరు నా యందు దయయుంచి రావడంవల్ల క్షమించి నా తప్పు మరచినారనుకొన్నాను. కోపము పోలేదా?

శశి - నాకు కోపమసలు రానేలేదు.

సుంద - రానేలేదా, ఎంత అదృష్టవంతుణ్ణి! శశీ, శశీ, నా మీద ప్రేమ ? నీకు కోపము రాలేదా?

అని ఆమె యెరుగకముందే ఆమెను కౌగలించుకొని ముఖమును ముద్దు కొనెను. శశిరేఖ వడలంతయును వణకెను. నిశ్చేష్టితయై నిలవబడెను. రు కారుచుండెను.

సుంద - ఎందుకు దుఃఖము? శశీ, నా మనోహరీ, ఎందుకు చెప్పవూ?

శశి - కృష్ణునికి అపరాధము కాదూ? నన్ను నమ్మిన అతన్ని మోసపుచ్చడమా? అది నా మనస్సు కాల్చి వేస్తోంది.

సుంద - ఇన్నాళ్ళు నువ్వతనిదానివై యుండలేదూ? ఇంకా ఎందుకు

శశి - ఇట్లాంటి మాటలు నాతో చెప్పొద్దు.

సుంద - కాని వొకటి చెప్పవూ? అతని విషయం అట్లావుంచి నా కిష్టమేనా?

శశిరేఖ తల యూగించెను." నా శశీ" యని అతడామె వక్షమును తన కుని నోటిపై మెడపై ముద్దులు పెట్టుకొనెను.

సుంద - శశీ, నన్నొక్కసారి, ముద్దు పెట్టుకోవూ?

శశి - వొద్దు.

అని అతనిని తోసికొని బయటకువచ్చి తోటలో కుర్చీలో కూర్చు సుందరరావు వెనుకగానున్న కుర్చీలో కూర్చుండెను. ఆమె మనసు మండిపోవు చున్నది; తాను చేసిన పనిని గూర్చి అలోచింప ప్రయత్నించె ఆలోచనాశక్తి పోయినటుల తోచెను. కొట్టుకొను ప్రతి నాడితోను పరువెత్తు కృష్ణుని కెంత కష్టము కలుగునో అను తలపు మాత్ర మామె మనసును మాద్చుచుండెను. వంట సిద్ధమైనది.

సుంద - భోజనానికి లేవండి.

శశి - నాకక్కర్లేదు. క్షమించండి.

సుంద - ఇది న్యాయమేనా. పైగా ఇంటికి వచ్చి పస్తుపడుకుంటా

శశి - సరే లెండి, పదండి. నిద్రగా వుంది.

శశి భోజనము నేమాత్రమును చెయ్యలేదు. ఆమె కొరకెంతో వంట చేయబడెను. సుందరరావు ముఖము చిన్నపోయినది. భోజనము తాంబూలము వేసికొనుచు, నక్షత్ర కాంతికింద తోటలో కూర్చుండి చామంతి పువ్వులను చీల్చి రేకులను వెదజల్లుచుండెను.

శశి - శెలవు. పొద్దుపోయింది! వెడతాను.

సుంద - రాణీ సేవకున కిచ్చిన ఆజ్ఞను మరచిందా?

శశి - చాలా పొద్దుపోయింది. ఇంకోసారి.

సుంద - మీ యిష్టము. నన్ను నిరాశ చెయ్యడం న్యాయమని తోస్తే -

శశి - సరేలెండి.

శశిరేఖ కూలబడినది. సుందరరావు ఫిడేలు తెచ్చుట కింటిలోనికి పోయినాడు. ...గ్రన చల్లని గాలి వీచుచున్నది. చీకటియందు చెట్లు ఇటునటు అశాంతితో ...లు చున్నవి. దూరమున పొదల ఆకుల చీకటిలో మిణుగురు పురుగులు ...యుచున్నవి. జాజిపువ్వులవాసన వింత తలపులను మనసున పుట్టించుచున్నది. ...పై నక్షత్రములు దీపములవలె మండుచున్నవి. ఆరుద్ర నక్షత్రముల గుంపు ...లో వింత యుద్రేకమును పొడమ చేయుచుండును.

సుందరరావు ఫిడేలు వాయింపజొచ్చెను. అతని హృదయారాటము లన్నియు సంగీతమున ప్రతిఫలించెను. ఆహా యేమి వాయిద్యము! ఎచటనో దాగి ...ప్పుడు మరచిన సుఖదుఃఖముల జ్ఞప్తికి తెచ్చు గానము. హృదయాకాశమున ...ని మబ్బులవలె యావరించిన యాదర్శముల వ్యక్తీకరించు గానము. ...ధములగు సర్వ విధములగు నుద్రేకముల నూతన తీక్షణత్వమున వెలిగించు ...ము. సర్వస్వరముల యందము నొకటి గూర్చి కంఠమాలికలవలె యర్పించు ...ము. సర్వదుఃఖములను, సందేహము లను ఆలోచనలను, భయములను ...లి జీవితమును ప్రేమ దేవతా పాదముల బలి యిమ్మని యుత్సహించు గానము, ...కమున సౌందర్యము కన్న మించిన దేదియులేదని, వేనోళ్ళ బోధించు గానము. ...ము, పాపము, కర్తవ్యము, విధి, అధికారము, ఆజ్ఞ, ప్రతిష్ఠ, పవిత్రత అనునవి ...జుడు సృజించుకొన్న మాయ భూతములే కాని ఇంకే మియు కాలనియు, ...ము ప్రేమయే ప్రేమింపదగినది ఒక్క నిముషమైనను సౌందర్యమే నని, ...దరస్వరముల వర్ణించు గానము. "ప్రేమించు, ప్రేమించు. ఒక్క నిముషమునకై ... సర్వమునుప్రేమ హోమమున దగ్ధము చేయుము"ని ప్రోత్సహించు ...ము. సౌందర్యము నశించుచున్నట్లు కనబడినను, తిరిగి తిరిగి హృదయముల ...ర్పునందించుట కుధ్రువమగుననియు, సాయంత్రపు ఆకాశ వర్ణములు ...యమునను, పున్నమినాటి వెన్నెల అమావాస్య నక్షత్ర కాంతి యందును, స్త్రీ ...దర్యము శిశువునను, మలయు మారుతము శీతలత్వము హిమమున, ...ర్భవించునని యాస పుట్టించు గానము. అట్టి, గానము నతడు ధ్వనింప చేసెను. ...రేఖ పదలు మరచినది ఆనందమున పరవశత్వము నొందినది. మనుష్యలోకము

నకు, కష్టసుఖములకు, స్థూల జడత్వములకు, అది దూరమగునేదో మహా లోకమున తిరుగుచుండెను. ఒక గంట, రెండు గంటలు, మూడు గం దాటినవి. ఇంకను సుందరరావు వాయించుచునే యున్నాడు. నిశ్చలతో యట్లే పరుండెను. పన్నెండు గంటలు కొట్టిన చప్పుడు కాగా, శశిరేఖ లేచేను.

శశి - నేను వెడుతున్నాను.

సుంద - అప్పుడే?

శశి - ఇప్పుడు కొట్టింది పన్నెండు కదూ? ఇక నేను పోవాలి.

అని లేచెను. సుందరరావును లేచెను.

సుంద - వెడతావా? శశీ? ఇదేనా ఆఖరుసారి. ఎట్లా బతకను?

యీా చీకట్లో నన్ను వదలిపోవడం న్యాయమేనా ?

తిరిగి చల్లని గాలి విసరెను. జాజి పువ్వుల వాసన "వైను" వలె తలకె వచ్చుచుండెను. సంగీత ధ్వని యింకను చెవుల వినబడుచుండెను. చుక్కల ప్రకాశమున కండ్లు మిరుమిట్లు గొల్పుచుండెను. సుందరరావు శశిరేఖను కౌగి కొని దగ్గరకు లాగుకొన్నాడు ఇద్దరి హృదయములను బాధయెత్తు చుండు కొట్టుకొను చున్నవి. వేడి నిట్టూర్పుతో గట్టిగ నామె నదుముకొనెను.

సుంద - శశీ, ఇప్పుడెక్కడికి వెడతావు. ఆస్పత్రి తలుపులు మూ నువ్వు యింటికి వెళ్ళి వుంటావనుకుంటారు వాళ్ళు. ఎక్కడికి పోతావు? దై నిన్ను నా దగ్గిరికి పంపింది తెలీడం లేదూ, శశీ, శశీ, సందేహమెంద రావూ?

శశిరేఖ తల గిర్రని తిరుగుచుండెను. ప్రతి నరమున సమ్మెట వలె కొ చుండెను. లోకమునందలి మహా ఉద్రేకములన్నియు ఆమె శరీరములో పొం టుల తోచుచుండెను. తలపులు లేవు. హృదయచేతనము మనేకాందోళనములతో బద్ధలగునట్లుండెను. అపరాధమే అను మహా ఒక మూల. అన్నియును నిర్లక్ష్యము చేయు మహా ప్రేమాగ్ని వదలం ఆహా ఎట్టి ఆనందము. ఆ కౌగలించుకొనిన చేతులు వంటిని తాకి మండు ఆ హృదయము తాకుడు నరనరమును పీకుచుండెను. మెడపై యురము

పువులు కాల్చుచున్నట్లుండెను. ఆ వేడి యూపిరి ఆమె ముఖమంతయును ప్రుచుండెను.

సుంద - ఈ నక్షత్రములు, యీ గాలి, యీ పువ్వులు ప్రేమించమని చెప్తున్నాయి. తెలియడంలేదూ? నిన్ను వొదిలి బతకలేను. వినపట్టంలేదూ మవాణీ! ఇంక వదలను, రా, రా, నా శశీ, మనోహరీ, నువ్వు నా దానవు. రా.

శశి - కాదు.నేను పోవాలి, వదలండి. అయ్యో, అయ్యో, వదలండి నేను ండను. తప్పు. నేను వొప్పుకోను. వదలమంటంలేదూ? నేను వుండను. నేను కను. అయ్యో

అని అరచి అతనిని తోసివేసి తలుపు దగ్గిరకు వడిగా నడిచెను. ందరరావును మెల్లగా వెంట వెళ్ళెను. అతనికి వళ్ళు తెలియుటలేదు. శశిరేఖ టతోడనే అతనికి పిచ్చియెత్తినట్లయ్యెను. ఇంతలో రాత్రి పిట్టవకటి కెవ్వున రచి శశిరేఖ దగ్గరగా ఎగిరెను. శశిరేఖ అరచి వెనుకకు సుందరరావు కౌగిలిలోకి గెను.

సుంద- ఏమీలేదు. ఎందుకు భయము. నేను లేనూ? ఎందుకు ణకుతావు?

శశి - నేను ఒక్కత్తెనూ వెళ్ళలేను. నన్ను మీరు తీసుకువెళ్ళండి. ఇంటికి ళతాను

సుంద - శశీ, నా మీద ప్రేమ లేదూ? రా, చూడు, ఈ రాత్రి నిన్ను వద ు. పోనీను శశీ, నన్ను వదలగలవూ? వదలగలవూ.

శశిరేఖ గజగజ వణకుచుండెను. ఆమె మనసామెకు తెలియదు. సుందరరా మెను యూపిరాడకుండ మాట్లాడనీక కౌగలించుకొని, ముద్దు పెట్టుకొనెను. ని చేతులు ఆమెను కఠినముగ - కత్తితో కోసినట్లే అంతటను తాకుచున్నవి.

సుంద - రా, ఇంక సందేహించకు. రా. ఈ రాత్రి నిన్ను వదలుతానా, క్కడ బలవంతంగా నిలిపిస్తాను గాని?

శశి - అయ్యో! రాను, రాను. నా మీద దయలేదూ? నన్ను వదలరూ? ు వెళ్ళాలి, అయ్యో!

సుందరరావామె మెడను గట్టిగా అదిమి ముఖమును ఊపిరాడకుండ ముద్దుచే సి వేసెను.

సుంద– నా మీద దయలేదూ? సరే, అంత అయిష్టమయితే!

అని పెనుగులాడు శశిరేఖను వదలి దూరముగ పోయెను. శశి వచ్చి అతనిని కౌగలించుకొనెను.

శశి – మిమ్మల్ని వదల్లేను. వదల్లేను. అయ్యో! వదల్లేను. నన్నురాని దగ్గరికి. నన్ను తీసుకుని వెళ్ళరూ? నా మనోహరా, నువ్వే నాకు. ఇం లేరు. మీరు లేంది బతకలేను. రండి రండి ఇంకెందుకు?

సుందరరావతి యానందమున ఆమెను యింటివైపునకు లాగె జుట్టు విడి ఆమెను కప్పి వేసినది. కళ్ళు కనపడవు.

సుంద – అమ్మా! ఎంత దయ నా మీద!

శశి – వద్దు, ఇది తప్పు, జన్మమంతా మీ దాసినౌతాను. కాని నన్ను నాకు శక్తిలేదు. బలంలేదు. నన్ను పోనీండి. నమస్కారము చేస్తాను.

సుందరరావామె మాటల నర్థము చేసికొను స్థితిలో లేడు, ఆమె చేయివేసి దగ్గరకు లాక్కొని అడ్డముగానున్న పడకకుర్చీ తగిలి ఆమెను లాగుకొని దానిపై బడెను.

సుంద – ఇంక మాట్లాడకు. ఇట్లా చూడు. శశీ, నా దాసవైనా సౌఖ్యము. నా దానివి, దానివి.

అని చేతిని ఆమె వక్షము చుట్టూ వేసెను.

శశి – అయ్యో కృష్ణా...............

ఇంక మాట్లాడకుండ రెండు పెదవు లామె స్వరము నాపెను. చల్ల వీచెను. పువ్వుల వాసన చుట్టుకొనెను. నక్షత్రములు ప్రకాశించెను. గాఢాంధ

# 7

తెల్లవారుచున్నది. అయిదు గంటలయినది. చల్లని, బడలికలు గాలి వీచుచుండెను. కొత్త పువ్వులు పూచి వనమంతయు అలంకరిం సన్నముత్యముల వలే ఆకులను పువ్వులను మంచు అలంకరించినది. రా జాజి, గులాబి, పారిజాతము, గన్నేరుపువ్వు లాతోటలో తలలుయూచు

ర్యాలలాగుచున్నవి. ఆకాశమునుండి గులాబి రంగు భూమియంతయు క్రొత్త ముపలె నలంకరించినది.

సుందరరావు పడకగదిలో శశిరేఖ లేచి కూర్చుని తోటవైపు చూచుచున్నది. కప్పుకొన్న సన్నని యుత్తరీయమునుండి సున్నితమును, సుకుమారమును, వు నగు నామె శరీరమంతయును, కానవచ్చుచుండెను. సున్నని భుజములను, పై సన్నని ముడుతలులేని మెడయును, సౌందర్యమును పూజించు కవులను తము అనిమిషులను చేయుగల వంపులు తిరిగిన ఆ వక్షమును నల్లని బుకుల కప్పు చుండెను. ఎఱ్ఱగ నలిగిన పెదవి యూరక వణకుచుండెను. మనసిచటలేదు.

రాత్రి నుండియు గడచిన సంగతులన్నియు తలపునకు వచ్చుచున్నవి. కృష్ణుని చుకొన్నపుడెల్ల ఆపరాని దుఃఖము పొర్లి పొర్లి వచ్చెను. ఆ గవాక్షమును కొనిన రాధామనోహరి పువ్వుల వాసనను గాలి లోపలికి కొనివచ్చుచున్నది. ర్యుని లేకిరణములు మంచుముత్యముల వివిధ వర్ణములతో మెరిపించుచున్నవి. డీనరికి తన కొరకై సిద్ధముగా నుండును గాబోలు అను తలపు శశిరేఖ సునకు వచ్చినది. తన స్థితిని తలచుకొని వేదననాపజాలక మూల్గుచు, ంచుచున్న సుందరరావు సంగతే మరచి, వెనుక నాతనిపై బడెను. అతడును " అనుచు ఉలికిపడి లేచి, ఆమెను తననానుకొను నటుల కూర్చుండపెట్టి.

"ఎందుకట్లా వద్దావు?"

శశి - ఏమీ లేదు.

సుంద - నాతో చెప్పు. ఏడవకు. ఎందుకూ ఏడుపు?

శశి - నేనిప్పుడింటి కెట్లా వెళ్ళను?

సుందరరా వాలోచించుచు అయిదు నిముషములు కూర్చుండెను.

సుంద - అవును. వెళ్ళొద్దు. ఇక్కడేవుండు.

శశి - అయ్యో, కృష్ణుడేమంటాడు? నన్ను విడిచి ఒక్క నిమిషం వుండలేడే! క్కడ చూచి బతగ్గలడా? అతని దుఃఖము చూస్తే నేనుండగలనా?

సుంద - మరి చేసేదేముంది? పోనీ, అతని దగ్గిరికే వెళ్ళు. ఇక తప్పకపోతే.

శశి - ఇక కృష్ణుడి మొహం ఎట్లా చూడను? వెళ్ళిమాత్రం ఏమి లాభం? ఇంక పాదాలు ముట్టుకోడానికైనా అర్హురాలినా? అయినా మిమ్మల్ని వదలగలనా?

సుంద - నన్నొదల్లేవా?

శశి - ఇంకా అడుగుతారా? వదలగలిగిన దాన్నవుతే యిట్లా యెం తాను?

సుంద - అయితే ఇప్పుడు మా ఇద్దరిలో నెవరినీ వదలవా ఏమిటి!

శశిరేఖ ఊరుకున్నది.

సుంద - అతనితో ఇదంతా చెప్పడమెందుకు ? అతనిదగ్గిరే ఉండు. స్నేహముగా ఉండు. నా కంతకన్న ఏమీ అక్కరలేదు ?

శశి - కోపముతో అతనిని విదిలించుకొని లేచినది.

శశి - నా సంగతంతే అనుకొన్నారా? మీ మీద కృష్ణునికన్న ప్రేమ కలిగి నన్ను బలవంతపరచినది కాని, లేకపోతే నా చిటికిన వ్రేలు దాన్నా మిమ్మల్ని? ఎప్పుడు మీ దాన్నయినానో, అప్పుడే కృష్ణుడు నా జీవితము తొలగిపోయినాడు. ఇంక కృష్ణుడితో ఉండలేను. మిమ్మల్ని వదలనూలేను. కృ ఉన్నా ఒకవేళ మిమ్మల్ని నా దగ్గిరకు రానిస్తానా? నా ప్రాణము ముందు కాని? ఆడవాళ్ళంటే అధములని మీ అభిప్రాయము కాబోలు. నా మీద నీచమైన అభిప్రాయమున్నప్పుడు మీకు నా మీద ప్రేమ యేమిటి? నేను ఎ క్కడికి వెడతాను.

సుంద - శశీ, నా తెలివితక్కువను క్షమించు. నన్నేమి చెయ్యమ ఆజ్ఞాపించు.

శశి - మనమిక ఈ వూళ్ళో ఉండకూడదు. మనము కంటికి కన ఉంటే పాపము కృష్ణుడు నన్ను మరచిపోవడం సులభమవుతుంది.

సుంద - నేనెట్లారాను? బదిలీ తెప్పించుకుని రావాలి.

శశి - మరి ఇప్పుడు కృష్ణుడు వచ్చి పిలవడా? ఏమి చెయ్యను?

సుంద - పోనీ నాలుగురోజులక్కడ ఉండు.

శశి - ఎట్లా ఉండను? నేనతని ఇంట్లో ఉండడం మీకిష్టమేనా?

సుంద - మరేమీ చెయ్యను?

శశి - నేనైనా వెళ్ళిపోతాను. బదిలీ అయిన తరువాత మీరు రండి

సుంద - ఎక్కడికి వెడతావు ?

శశి - ఎక్కడికైనాను.

సుంద - తరవాత కృష్ణుడు వచ్చి నీవెక్కడని నన్నడిగితే?

శశి - అవును. అదొక యిబ్బంది.

సుంద - అదికాదు. వెళ్ళేటట్లయితే మనమిద్దరము వెళ్ళాలి. శలవుకి రాశేశి కూడా ఈవాళే వస్తాను. మధ్యాహ్నము రైలులో వెడదాము. సామానంతా మని వెనకనుంచి వ్రాస్తాను. ఎవరికీ తెలియకూడదు వెడుతున్నామని.

శశి - సరే. మరి సాయంత్రముదాకా? ఇప్పుడే వాళ్ళు వొస్తారే?

సుంద - సాయంత్రము వస్తున్నామని ఇప్పుడే కృష్ణుడికి చీటి వ్రాస్తాను.

మధ్యాహ్నము ఒంటిగంటైనది. సుందరరావు బయటకు పోయి యుండెను. వసరమైన వస్తువు లొకపెట్టెలో సర్ది శశిరేఖ గదిలో కాగితము కలము ందుంచుకొని ఆలోచించుచు కూర్చుండెను.

వాలిన సూర్యుడామె శిరోజములపై గవాక్షములోనుండి దాని కల్లుకొనిన ర్యకాంతము తీగె ఆకులలో నుండి మెరయుచుండెను. ఆ విశాల నేత్ర ల నుండి కన్నీరు జలజల రాలుచుండెను. వెక్కి వెక్కి వచ్చు దుఃఖముతో వక్షము లుచుండెను. వ్రాత ఒక్క అక్షరమైనను సాగలేదు. వ్రాయబోవుసప్పటికి పొరలి రలి దుఃఖమువచ్చి కాగితము, చేతులు తడియుచుండెను. తాను చేయబోవుపని యమా? తన కొరకు జీవితమును పాడుచేసుకొని, చదువు మధ్యలో మాని, డుకెంతో సంపాదించునని గంపెడాశ పెట్టుకొనియుండు తల్లిదండ్రుల శపరచి, దరిద్రము ననుభవించుచు, తన సౌఖ్యమే అతని సౌఖ్యమని ఎంచుకొని, డునీడగ పనిచేయుచున్నను, తన వెంట శశీ, శశీ యని తిరుగుచు, ఒక్క మిషము కనుబడపోయిన ఎక్కడెక్కడ యని తల్లడిల్లుచు, తనలోనే జీవితము నందముగల కృష్ణుని వదలుట మంచిదా? ఈ వార్త విన్న తరువాత అతని నందముండునా? శాంతియుండునా? పిడుగుపడినట్లాతని ప్రాణము నలిగి దా? ఒక్కసారి అట్టి సుగుణ నిధిని స్వార్థత్యాగిని, నిష్కపటవర్తనుని, ప్రేమావిధిని, మాయకుని, ఇట్లు వంచించి, నరకమున త్రోసిపోవుటకన్న క్రూరత్వము గలదా? హితులను, బంధువులను, సంఘముకు వదలిన ఇంకేమి కలదు అతనికి మగాక? తన ఆనందముచే, పాదములచే, స్నేహముచే, మంత్రింపబడిన ఆ

నీళ్ళు, చెట్లు, పచ్చికబయళ్ళు, కాలువలు అతడు చూచుచు, ఆ ప్రేమ
జ్ఞాపకమున, ఎట్లు బ్రతుకగలడు? అతని నంతగా ప్రేమించునటుల
తానే అతనిని మోసగించిన అతని హృదయము పగులదా? మనుష్యుల
విశ్వాసము నశింపదా? విశ్వాసము, ప్రేమ, సంతోషము పోయి,
అథమ జీవితమున కూలునోకదా? అటుపై అతను బ్రతికి ఎందుక
ఎందుకు? కాని ఏమి చేయవలెను? ఎట్లు తిరిగి అతని దగ్గరకు పోయి
గలదు? తనకు శాంతి యుండునా? ఇంక ఆ యింటి పనులు చేయుచు
యుండగలదా? హృదయాకాశమందు క్రొత్త ఆదర్శములు క్రొత్త ప్రేమావే
యుదయించినవి. ఇంక తన విధి వెనుక బోయి తీరవలయును. పూర్వజన్మ
వదలవలయును. నిర్మలము, అమాయకము, వెన్నెలవలె స్వచ్ఛమునగు
ప్రేమను వదలి, గూఢము, తీక్షణమునగు యీ సుందరరావు ప్రేమను
పోవలసినదే. ఎప్పటికిని కృష్ణుడు తనవాడు. అతనిని నమ్మిన ఇంక
మక్కరలేదు. భయము లేదు. తనకు బాధ కలుగచేయుటకన్న ప్రాణము
వదలును. కాని సుందరరావును జూచిన సర్పమును చూసిన రీతిని భ
ఎంత మంచిగా నున్నను ఇపుడు ఏ నిమిషమున ఎదురు తిరిగి కాటు వే
నమ్ముటకు వీలులేదు. కాని ఆ భయమే, ఆ మోహమే నామె నాకర్షించుచు
కండ్లను మంత్రించి వేయుచుండెను. ఇంక తనకు శాంతిలేదు. ఆ మహా
మోహమున మ్రగ్గిపోవలసినదే. ఆ మహామంత్రమును ఆ ఇంద్రజాలము
ప్రేమ నాహుతి చేయవలసినదే. తాను ప్రేమతో నాటలాడు దినములు దాటి
నవి. ప్రేమను ప్రౌఢవలె నాలింగనము చేసికొనవలసిన సమయము వచ్చి
ఇంక పూర్వపు జీవనము పనికిరాదు. సంశయరహితముగ జీవన వార్ధిని కొట్టి
పోవుటకు సిద్ధముగ నుండవలసినదే.

ఆ పడవ షికారు వెళ్ళిన సాయంత్రము ముందు తనకును కృష్ణునకు
శాశ్వతమగు ప్రేమబంధన మేర్పడినదనియు, కృష్ణుడు తనయందవశు
ననియును ఇద్దరును ఒక్కరినే ఒకరికొరకొకరు ప్రేమించెదరనియును,
అనుకొనెను. అట్టి బంధన మేర్పడిన, అది శాశ్వతమై యుండెడిది. కాని యి
కలదు? ఆ సాయంత్రము నీళ్ళలో పడుటతోడనే ఆశలన్నియు అడుగంటి
స్వప్నములు మాయమ య్యెను. ఆనాటిపాటుతో కృష్ణుడు, తన ప్రియు
సంతానమునుగూడ గోల్పోయెను.

దుఃఖమంతయు కృష్ణుని కొఱకే. అతడు తనకు వద్దనిన, తనపై ప్రేమలేదనిన
ొక బాలికను వలచిన, తానెంత సంతోషముగా అతనిని వదలియుండును.
నను తాను వెళ్ళిన తరువాత సంతోషమున నుండునేమోలే, అతని స్వల్ప
ము కొరకు తన జీవితము నంతను ఎట్లు పాడుచేసికొనగలదు? ఇక తప్పదు,
తనను రమ్మని పిలుచుచుండెను. తాను పోక తప్పదు. కృష్ణునికి శలవు !
్య ! అతనినింక చూచుటపడదు కాబోలు. తన కృతఘ్నతను విని, అతని
ు ముఖ మెట్లగునోకదా! ఆ ముద్దు కన్నులనుండి ఎంత నీరు కారునోకదా?
విలపించునో, పొరలి పొరలి దుఃఖము వచ్చెను.

✦ ✦ ✦

కృష్ణుడు సాయంత్రము నాలుగు గంటలకు తన కుటీరము వాకిట నిటునటు
తితో తిరుగుచుండెను. మాటిమాటికి ఆస్పత్రినుండి శశిరేఖ వచ్చుచున్నదేమోనని
ుచుండెను. ఇన్ని దినములెన్నడు నాతడు శశిని విడిచియుండలేదు. ఒక్కసారి
ను వెంటనే చూడవలెననెడి తృష్ణ నాతని నావరించెను. ఇంటివద్ద
ర్యచేయుట కాతడుగాక ఇంకెవ్వరును లేరు. ఎంతో ఆశతో, ఏమియును
, ఇంకను రాలేదేమని యాశ్చర్యపడుచుండెను. ఇంతలో ఆస్పత్రి నౌకరొకతని
యుత్తరము తెచ్చియిచ్చెను. ఇంక ఏమి యాటంకములు వచ్చినవో కదాయని,
రపడు హృదయముతో, దానిని తెరచి చదివెను.

నా ముద్దుల కృష్ణా,

శశిరేఖయనుదాని నెన్నడును కలిసికొనలేదనుకొనుము. నిన్నన్ని కష్టముల
ములందించిన శని యీనాటితో తొలగిపోయినదని సంతోషించుట
కొనుము. నీమీద ప్రేమ నాకెన్నడును మరపునకు రాదు. నీ నుండి యెడబాటు
తికష్టముగా నున్నది. నన్ను, లాకులను, చెట్లను, వనమును పూర్ణముగ
ిపొమ్ము. నీవంటి సుచారిత్రునకు నా వంటిదాని సంపర్కము తగదు. నా
యం బ్రద్దలగుచున్నది. నీవెంత దుఃఖించెదవో నేనెరుంగుదును. కాని ఏమి
గలను? నేను మరణించితి ననుకొనుము. కృష్ణా, శలవు, నీ పటమెల్లప్పుడు
మలిన హృదయమున శాశ్వతముగ నుండును. నన్ను మరచుటకు
త్నింపుము. నీ ముద్దు ముఖమును, ముద్దు మాటలను, యీ జన్మమున
ను.

నిన్న రాత్రి నేను...

కృష్ణుడింతవరకే వెలవెలబారు ముఖముతో చదివెను. నోటమా
కన్నీరు బొట్టులేదు. నరికిన వృక్షమువలె, మరణించిన వానివలె క్రిందబడి

# 8

నెలదినములు సుందరరావు శలవు పుచ్చుకొనెను. ఇరువు
పట్టణముల విహరించిరి. మళయాళమున, బొంబాయి రాజధాని య
తిరిగిరి. సుందర రావుకు బళ్ళారిజిల్లాలో జిరగణహల్లీ యందు
చేరవలసివచ్చెను. సుందరరావు నుండి మహా ప్రేమను, గాఢమగు య
ననుభవించి శశిరేఖ సంతుష్టురాలయ్యెను. సుందరరావును శశిరేఖా సౌం
తనివితీరా యనుభవించెను. కాని సుందర రావుది కృష్ణుని దానివలె
నిర్మలమునునగు మనసు కాదు. ఎల్లప్పుడు నెడతెగని అశాంతాగ్నిలో
తరువాత సౌఖ్యమును గోరుచుండును. కృష్ణుడు శశిరేఖ కెట్లు ఆ
కలిగింతునాయని యాలోచించుటచే యామె యానందించినపు డెల్ల
సంతోషించుచుండెను. సుందరరావు శశిరేఖ నుండి తానెంత యానం
పొందుదునాయని ప్రయత్నించుటచే ఆ యానందమును నాల్గుదిన
కోల్పోయెను. ఒకరుని సొత్తయినంత కాలము దానిని సంపాదించుటే
తను జయము పొందిన కొలదిని మహదానందమును పొందెను. ఇ
స్వర్గము లేదనుకొనెను. కాని యది తనది యగుటతోడనే దానిలో సుం
పోయినది. స్త్రీ తన సమస్తమును తన హస్తములోనుంచిన కృతజ్ఞత చూపు
మిక్కిలి యరుదు. స్త్రీ పురుషుని తన శక్తిచే యాజ్ఞయందుంచుకొనవల
పురుషుడామెను నీచముగ లోబరుచుకొనును అందువల్లననే స్త్రీ పురు
విషయమునను సమానులైనగాని ప్రేమయుండదు. ఒకరిపై నొకరాధా
యా ప్రేమ నశించినదే. శశిరేఖ యింకొకరి యధీనమందుండి, తనది కా
సుందరరావవామెకు బాని సయ్యె యుండెను. ఆమె కృష్ణుని దగ్గరున్న
స్వతంత్రముగ జీవించుచున్నను సుందరరావామెకు యింకను బానిసయై య
వాడే కాని వేరు దిక్కులేక, అతనిపై తన జీవనమునకు తనపైనాధారపడ
శశిరేఖ అతనికి మహాభారమయ్యెను. ఆమె యంద మెంత ఎక్కువగ

ంత కొత్తగ కాన్పించుచున్నను, ఏమి చేయుటకైన తనదేయని నిశ్చయమగుట ోడనే, ఎందునకును కొరగానిదయ్యెను. సౌందర్యము నితరుల యందు చూచి ానందింపగల స్వభావములు యరుదు. సుందరరావువంటి వారు సౌందర్యమును ూచుటతోడనే తా మనుభవింపనిది శాంతినొందరు. శశిరేఖ సౌందర్యమును ూచి కృష్ణుడు పూజించెను. తానా సౌందర్యమున కేమి యివ్వగలనా యని ోచించెను. కాని సుందరరావు దాని నెప్పుడనుభవింతునాయని తొందరపడెను. ౌందర్యము ననుభవించుట స్వార్థపరుల కెట్లు సాధ్యమగును? భౌతిక శరీరముచే, ంద్రియములచే, శరీరము ననుభవింపగలుగుదురు. గాని ఆ నిర్మలమును, ౌతికాతీతమునగు సౌందర్యము నెవ్వడు తనది మాత్రముగ చేసికొనగలడు? ంతయో ప్రయత్నించియు విఫలుడై తన కామాగ్నిచేతనే దహింపబడి, యామె ాత్మనర్థము చేసికొనలేక అంధకారమున నిరాశచెంది అతడు క్రూరత్వమును హించెను.

శశిరేఖకు మాత్రము ఒకసారి పొడమిన ప్రేమ సుందరరావుపై పోలేదు. తని ముఖమును, తెలివిని, శక్తిని చూచినపుడెల్ల ఆమె కాశ్చర్యము. అతని నము తనకు సమస్త సౌఖ్యముల నిచ్చుచుండ, అమెకు మిగుల గర్వము. కాని ుందరరావామె యెడల చూపు అనాదరము హృదయమును వేధన పరచుచుండెను. యినను ఆమె కతనిపై కోపమే మాత్రమును లేదు. అతనిని నమ్మి వచ్చితినేయను ంతయునులేదు. దినదినమును ఏమియును క్రొత్తలేక, జీవనరహితముగ నడుచు ాలముకన్న అతని క్రూరత్వముతో కూడుకొన్నను, యీ భయంకర జీవనమే మె కుత్తమముగ తోచెను.

అనేకమంది నౌకర్లున్నను శశిరేఖయే యింటిపని నంతను స్వయముగ ూచి, సుందరరావున కెక్కడును విసుగు కలగచేయకుండ ప్రయత్నించుచుండెను. ాని అతనికి తృప్తిలేదు. ఒకనాటి సాయంకాల మతడా స్పత్రినుండి యింటికి చ్చెను.

శశి - ఈవాళ హంపికి వెళ్ళడం వుందా?

సుంద - తెలీదు.

శశి - పోనీండి. ఇంకోసారి వెళ్ళొచ్చును. నాకీవేళ వంట్లో సరిగ్గాలేదు.

సుంద - ఎప్పుడూ ఏదో వకదాన్తో మూల్గుతో వుంటావు. నీ వొళ్ళు బాగు లేదని నేను నా ప్రయాణం మానుకుంటాను గావును. తెల్లారకట్టే వెళ్ళాలి.

శశి - ఎందుకంత కోపంగా వుంటారు?

ఎంతో భద్రముగా బట్టలు వేసుకొని తల దువ్వుకొని ఎవరైన చూచిన మోహించునంత యందముగా కనుపడుచూ, ఆమె యతని కొరకు వేచియు యుండెను.

సుంద - పాడుదేశం వచ్చాం. ఎంత హాయిగా వుండేది గోవిందపురము ఈ మూర్ఖము, పెంకెతనము, పిరికితనము ఎక్కడా చూడము. ఈ జన మనుష్యులో, పశువులో తెలీదు. ఉండడానికి ఇల్లన్నా మంచిది లేదు.

శశి - పోనీండి. ఎట్లాగో ఓలాగు ఉన్నాంగా.

సుంద - ఉన్నాము. వాళ్ళకేమో? ఆమె మీ భార్యేనా అని అడుగుతారు. కాని అనుమానంతోచి మన్నీ యింట్లోంచి పొమ్మన్నారు. ఆ దేశంలో గవర్నమెం యిళ్ళుండేవి. ఇక్కడ అవన్నీ లేవు.

శశి - పోనీండి. వెళ్ళిపోదాం.

సుంద- నీకేం చెపుతావు. ఎక్కడికి వెడదాం? వాళ్ళు అసలు అనుమా ఎందుకు వడాలి? ఏదో నువ్వే చెప్పి వుంటావు. లేకపోతే నీ టక్కుల వేషాలూ చూసి, వాళ్ళు అనుమానపడి వుంటారు.

శశి - నన్నెవరు పలకరిస్తున్నారు, నేను చెప్పడానికి ?

సుంద - లేకపోతే ఆ పశువు కృష్ణుడు రాసివుంటాడు వీళ్ళకి ఓర్వలేక

శశి - ఆయన అల్లాంటి వాడుకాదు.

సుంద - అతన్ని నా ముఖం ముందు వెనక వేసుకు రావడం బహు బా వుంది. అతని దగ్గర వుండకపోయినావూ, నన్నిట్లా యేడిపించకపోతే ?

శశిరేఖ సుందరరావు దగ్గరకు వచ్చి మెడచుట్టును చెయ్యివేసి.

శశి - ఎవరో విసికిస్తారు మిమ్మల్ని అందుకనే ఇట్లా అవుతారు మీ అంది.

సుంద - ఈ మునిసిపలు సంఘమంత బుద్ధిహీనుల్ని ఎక్కడా చూ లేదు నేను. నేను వాడి నౌకర్ని కాబోలును. వంగి సలాములు చెయ్యలేదని కోపం

పం. అందరి కాళ్ళు పట్టుకొని నాలుగు వోట్లు తెచ్చుకొని నాలుగు రోజులు
పగలు వెలగపెట్టేవాడి కూడా అంత పొగరే ! ఇంక తక్కినవాళ్ళు చెప్పనే
ద్దేదు. వాళ్ళింటో ఎవరికన్నా జబ్బుగా వుంటే నేనేమో కనుక్కొంటూ వాళ్ళచుట్టూ
గాలిట. ఒకడు వచ్చి ఏం ఏం మందులున్నాయో చూపించు ఆస్పత్రిలో అన్నాడు.
సినట్లే వాడికి! అవతలికి నడవమన్నాను. అందుకని వాడికి నా మీద కోపం.

శశి - బాగానే వుంది! మంచివాడే దొరికాడు! పోనిద్దురూ! ఈ పాడు పని
నేద్దురూ, మన ప్రేమ ఉందిగా ఇంకేం కావాలి మనకి!

సుంద - ప్రేమ నీకు రేపు భోజనం పెడుతుంది! పిచ్చి మాటలు రెండు
స్తుంది ఎక్కడో.

శశి - నా మాట వినరూ? ఇట్లా చూడండి. ఈ చీర బాగుండలేదూ?
ళ సాయంత్రం...

సుంద - నూరుమందిని చూశాను, ఇంతకంటే బాగా కట్టుకొన్న వాళ్ళని.
వాతాకాదు వాతాకాదు.

శశిరేఖ నుండి ఆనందం అనుభవించడం సుందరరావునకు చేతకాదు.
ఆత్మ మనసు అతని కర్థముకావు. అందుచేత ఆమె కష్టపడడం చూడడంలో
ందము సంపాదింప మొదలుపెట్టెను.

తెల్లవారి హంపికి వెళ్ళిరి. శశిరేఖ సౌందర్యమును పూజించు మహాభక్తురాలు.
ృతియందుగాని మనుజుల యందుగాని సౌందర్య మామెకు వెర్రినెత్తించును.
పి యందావచ్చిన బయళ్ళను, రాళ్ళగుట్టలను చూచుటతోడనే ఆమె కతి
నందము కలిగెను. సుందరరావామెను వెక్కిరించుచున్నను, ఆమె సంతోష
గక పైకి ప్రవహించుచుండెను. ఆమె కానందము కలిగిన కొలదిని అతనికి
మెక్కువగును.

శశి - ఇక్కడ ఈ గాలేదో సంతోషము కలిగిస్తోంది. ఈ స్థలమునందే ఏదో
శ్యమున్నది. చూడండి ఈ చెక్కడము. ఏ కొండనో ఇక్కడ చెక్కివేశారు.
ము మధ్య ఇట్లాంటివివుంటే ఎంత ఆనందంగా వుండేదో ? ఆహా !

సుంద - ఇవన్నీ నీవు కవివలె వర్ణిస్తున్నా ననుకొంటావు గావును. నేను
ఇంకెవరూలేరు వినడానికి !

ఒక్కసారాతని మాట కెదురు చెప్పదు శశిరేఖ. ఎంత వెక్కిరించు
విననట్లే యూరకుండును.

శశి – అబ్బా ఎంత బాగుందండీ ఈ గుడి. ఇట్లా దగ్గిరగా కూ
ఎవరూ లేరుగా? ఎంత మంచి గాలి. రారూ?

ఆమెయే అతని దగ్గిరగా పోయి కూర్చుండెను. అతని భుజముపై
వేసెను.

సుంద – అసలే చమటగా ఉన్నది. ఉండు. సరసాలు చాల్లే.

శశి – ఈ రాళ్ళను పైకి ఎట్లా ఎత్తారో కదా! ఎంత బాగా చె
ఎంత గర్వంగా వుండేదో ఈ పనివాళ్ళకి! ఒకళ్ళకంటే ఒకళ్ళుమించి పని చే
పోటీలు వేసుకునేవాళ్ళు కాబోలు? అంతా రాజుల అనుగ్రహము. ఒక్క మం
ఒక్కగుడి తయారయిందంటే ఎంత సంతోషంతో ఎంత ఉత్సవాలు చే
కదా?

సుంద – ఏదో ఒకటి చేసేవాళ్ళు. ఎందుకట్లా వాగుతావు?

శశి – ఇవి చూస్తే ఆనందం కలగడం లేదూ? ఆనందం కాదు.
వస్తోంది. అయ్యో! అన్నీ పాడుపడ్డాయికదా? నిజంగా మహారాజ్యమై
ఇది. ఇక్కడంతా సైన్యాలుండేవి కాబోలు! వాళ్ళు పనిలేక హాయిగా పడుకు
ఈ మందిరం చూడండి. ఆడవాళ్ళు దీనిమీద వుండేవాళ్ళు. పాపం, యు
గెలిచివస్తే భర్తల్ని సన్మానించేవాళ్ళు. ఆఖరుసారి తురకలు నాశనం చేసే
తుట్టెలో యీగవలె ఒక్క మొగవాడు సంరక్షించేవాడు లేక ఎంత అదలిపోయ
కదా! ఈ చెరువులు చూడండి. ఎన్ని ఉద్యానవనాలు ఉండేవో!

సుంద – ఇంకా ఎక్కువ వాగినావంటే నేను ఒంటరిగా వెడతాను.

శశిరేఖ పొరలివచ్చు తలపులను లోపల కుక్కుకొనెను.

సాయంత్రము తుంగభద్ర వడ్డున మెట్లమీద కూర్చుండిరి. నది ప
నుండెను. నదిమధ్య ఎనుములవలె స్థిరముగనుండు పర్వత శిలల తాకి
నవ్వుచు ప్రవాహము పొంగి పొరలుచుండెను.

శశి – చూడండి. పూర్వము ఇక్కడ ఎంత శోభగా వుండి వుండాలో
వంతెన వుండేదిట. ఈ గట్టున గుళ్ళూ ఇళ్ళూ ఉండేటప్పుడు స్త్రీలు పూజ

చ్చుకొని గుఱ్ఱకి వెడుతూవుంటే, పిల్లలు ఆడుకుంటూ వుంటే వద్దనంతా నకుమల్లే అనేకమంది చల్లగాలికి కూర్చునివుంటే, చాతయినవాళ్ళు తోలు పడవల్లో రా ప్రవా హంలో ఆడుతూవుంటే, వూరంతా విజయధ్వజాల్తో నిండివుంటే ఎంత గుండేది! అప్పుడు మనమూ, మన రాజ్యమూ, అని గర్వపడుతూవుంటే ఎంత పుగా వుండేది! మన యుద్ధాలు, మన దండయాత్రలు, మన యుద్ధ సన్నద్ధాలు, ంత తమాషాగా తేచుండేది!

సుంద - మళ్ళీ మొదలుపెట్టావూ ? పోదాం పద యింటికి. ఇంత దూరం మాటవిని వచ్చాను బుద్ధిలేక.

శశి - ఇంకొంచెం సేపుండరూ ? మళ్ళీ ఎప్పుడొస్తామో !

సుంద - వస్తావా రావా, నేనొక్కణ్ణే వెళ్ళనా ?

ఇద్దరును కమలాపురము బంగళాకు వెళ్ళిరి. భోజనమైన తరువాత ందరరావు బయట కూర్చున్నాడు. శశిరేఖ గదిలో అద్దము ముందు నిల్చుని న్నది. స్నానము చేసి తలలో పువ్వులు పెట్టుకొని సౌందర్య దేవతవలె నబడుచున్నది. ఆలోచించునట్లే యుండి, చివరకు సుందరరావు దగ్గరకు పోయి ర్చుండెను.

సుంద - ఎవరూ లేరుగా చూడ్డానికి? ఎందుకా షోకు?

శశి - ఎవరూ లేరూ?

సుంద - తెలివికి సంతోషించారు.

శశి - నిద్దరొవటంలేదూ?

సుంద - వొస్తోంది.

శశి - అయితే రండి.

సుంద - పరుపు బయట పడెయ్యి. వసారాలో పడుకుంటాను.

శశి - లోపల పడుకోరాదూ ?

సుంద - నీ కెందుకాసంగతి ?

శశి - పడుకోరూ? నే నడుగుతున్నా ననన్నా!

సుంద - పో! నా కసహ్యా మేస్తోంది. నీ మాటలూ నీ వేషాలూ!

శశిరేఖ మెల్లగా లేచి లోపలికి వెళ్ళెను. దినము తరవాత దిన తటస్థించుచుండెను. శశిరేఖకు ప్రేమయే ఆహారము. అది లేకుండిన శాంతిలేదు. తన వలన ఏమి నేరమో ఆమెకు తెలియదు. సర్వ విధముల సంతోష పెట్టజూచెను. అతడు తనతో ప్రేమగా మాట్లాడకూడదా? పూర్వ తన్నొకసారి యాదరింపరాదా? అతనికి తన ప్రాణమునుగూడ యివ్వ సంసిద్ధమై యుండెను. కాని తనపై దయతో నొక్క చూపైన చూడడే! ఆమె దిన మొక మరణముగా నయ్యెను. అతనిపై తనకెంత ప్రేమ! అతడొక్కసా చెయ్యివేసి మంచి మాటలాడినా చాలదా? అదియే కరువయ్యెనా? ప్రేమ కాన కదా అతనిని కోరినది? కాని యేమియును తెలియని చంటి బిడ్డవలె విచా తప్ప శశిరేఖ కేమియును తెలియదు. అతడు గాక జీవితమున తనక ప్రేమలేక ఆమెకు జీవితము భారముగ తోచెను. శాంతి లేదు. సౌఖ్యము ఆపరాని దుఃఖముతో మంచముపై బోర్లపడి వెక్కి వెక్కి యేడ్చెను. ఈ విధ రాత్రులు గడుపుట ఆమెకు మామూలే, ఏమియు నెరుగక నెరుంగుటకు లక్ష్య సుందరరావు నిద్రించుచుండ, ఆమె మాత్రము రాత్రంతయు నిద్రలేక చప్పుడైన నాతనికి కష్టము కలుగునేమోనని, లోపలనే ఏడుపు గ్రక్కు జాగరము చేయుట ప్రతి రాత్రియు జరుగుచుండెను. తెల్లవారి సిద్ధముగా న నుంచక ప్రొద్దెక్కి లేచిన చీవాట్లు తప్పకపోయెను.

ఒక గంట అయిన తరువాత మెల్లగ తలుపు తెరచుకొని సుందరరా పరుపు బయటకు తీసుకొని పోవుటకు వచ్చెను. శశిరేఖ త్వరగా ము తుడుచుకొని చిరునవ్వు నవ్వుటకు ప్రయత్నము చేయుచు కూర్చుండెను.

సుంద – ఏం పన్లేదూ? ఏడవడం తప్ప? ఆ కృష్ణని తలుచుకొని యే నన్ను చూచి ఏమీలేనిదానివలె దొంగవేషం వేసుకున్నావుంటావా?

శశి – మీకు తెలీదూ, నేను ఎవరి కోసం ఏడుస్తానో?

సుంద – జ్ఞాపకం వచ్చింది. నిన్న తమరికొక ఉత్తరం వచ్చింది, విటుడి దగ్గరనుంచి, చదువుకోండి.

అని కోటు జేబులో వెతకి ఒక చించిన కవరును ఆమెపై పడ దానిపై చిరునామా ఆమె చూచెను. కృష్ణని వద్దనుండి. గుండెలు కొట్టుకొ ఎట్లున్నాడో? అతనిపై ప్రేమ అణగియున్నను, జాలి మాత్రము విశేష

...ందెను. అతని పేరు విన్నప్పుడెల్లను కన్నీళ్ళు కారును. అతడు తన కృతఘ్నతకు ...వాట్లు పెట్టెను కాబోలు. లేక ప్రేమ తెల్పుచూ వ్రాసెను కాబోలు ! దానిని ...ందరరావేల చదువవలెను? ఇంక నావేశము నాపుకొనలేకపోయెను.

శశి - నా వుత్తరమెందుకు చదివారు?

సుంద - (నవ్వి) ఈ పతివ్రతల వుత్తరాలు చదవకూడదు గావును? వెళ్ళే ...త్రిస్తున్నావేంటి? శీఘ్రముగా దయచెయ్యి. యోగ్యతాపత్రం కూడా యిచ్చి ...పిస్తాను.

శశి - నాకు వచ్చిన వుత్తరం చదవడానికి మీకు సిగ్గెయ్యలేదూ? ఇంకా ...ట్లాడతారు !

సుంద - ఏం, మాటలు మీరుతున్నాయి. నోరుముయ్యి? ఎందుకూ పనికిరాని ...డు ఎవడో యింత మహావుత్తరాన్ని....

శశి - అట్టే మాట్లాడకండి. అతని కాలిగోరికి సరికారు మీరు ప్రవర్తనలో.

సుందరరావు కన్ను లెర్రచేసి ఆమెను కొట్టబోయెను. ఆమె చేతులు కట్టుకొని ...ల్పని చిన్న నవ్వు నవ్వుచు -

"కొట్టండి అదొక్కటే తక్కువగా వుంది. కొట్టడమే."

ఆమె చూపులలో ధైర్యముచూచి అతను మాట్లాడక వెనుకకు తగ్గి వెళ్ళి ...యెను. ఆమె ఉత్తరము చదువుకొనెను.

శశీ,

నిన్ను మరచిపోజాలను. ఎటుచూచినా నీ జ్ఞాపకమే. ప్రయత్నించుచున్నాను ...ని మరుచుటకు దుర్భరమైన వేదనను పొందుచున్నాను. నీపై నాకు కోపముండదు. ...వు మాత్రమేమి చెయ్యగలవు? నీ దగ్గరకు నేను రావడానికి వీలులేకుండా చేసినావు. ...క యావజ్జన్మమున దర్శనమైనలేదు కదా మనకు? నీవైనను నన్ను మరచిపోయి ...ఖ్యముగా నున్నావని తలచెదను. నాకు కలిగించిన బాధవంటి బాధను ...వెన్నడును పొందకుండ యీశ్వరుని ప్రార్థించుచున్నాను.

నిన్ను మరవలేక దుఃఖించు

కృష్ణుడు.

శశిరేఖ ఉత్తరమును హృదయమున నద్దుకొని దుఃఖించెను. అయ్యో! ఎ
బాధపడుచున్నాడో అను తలపు వేదనను కలిగించుచుండెను. ఒక్క కను
రేయి యంతయును అట్లే నిశ్చేష్టితయై నేలపై పడియున్నది. తెల్లవారకట్ట వల్లన
కొంచెము నిద్రపట్టెను. ఇంతలో సుందరరావు కాలితో ఆమెను త్రోసి

"లే, లే, బళ్ళు వచ్చాయి" అన్నాడు.

శశి – అబ్బా, కొంచెముండరూ, తల బద్దలవుతోంది. నిద్దర్లేదు. క
మండిపోతున్నాయి. కొంచెముందురూ ?

సుంద – నీవెవణ్నో తలుచుకుంటూ, రాత్రంతా జాగరణచేస్తే రాణీ
కోసం నేనాగి వుండాలి కాబోలు ?

శశి – నా మీద అంతమాత్రం దయలేదూ. నాకు మీమీద తప్ప ఎ
మీద ప్రేమ? ఇట్లా కూచోండి ఒక్కసారి.

సుంద – పో, పో, నీ దొంగవేషాలన్ని? లే, ముందు.

# 9

ఒక్క సంవత్సరము గడచెను. శశిరేఖ సుందరరావు భార్య కాదని యూహ
గ్రహించి వారినొక యింటినుండి యింకొక యింటికి వెళ్ళకొట్టిరి. నౌకర్లు దొర
సహాయమెవరును లేరు. మాటలాడుటకును మనుష్యులైనను లేరు. ఈ కష్టము
సుందరరావు క్రూరత్వ మెక్కువయ్యెను. సంభవించుచున్న యీ కష్టములన్ని
శశిరేఖ వలననే కలుగుచున్నవని తుదకు అతడు తలచెను. కాని ఆమెను వ
మాతడు వదలలేదు. ఆమె సౌందర్యమును చూచిన అతని కతితృష్ణ ఆమె మన
స్వభావమును అర్థము చేసికొనలేక అతడు ఆమెను బాధించుటలో తన అసహా
మును చూపుకొనుచుండెను.

తుదకు శశిరేఖకు కూడా ప్రేమ నశింప నారంభించెను. ఇప్పుడా
తన నేమన్నను లక్ష్యములేదు. అతడు తనతో దినములకు దినములు మాట్లాడ
గడిపిన భయములేదు. కాని ఆమెకు జీవన మేమాత్రమును తృప్తికర
లేకపోయెను. శశిరేఖకు సౌందర్య మాహారము. ప్రేమ ప్రాణము. ప్రేమ
ఆమెకు సమస్తమును శూన్యముగను, అర్థవిహీనముగను కాన్పించును. ప్రే
కొరకామె యేమైన సమర్పించును.

